# శ్రీ రాహ్వష్టోత్తర శతనామావళిః

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం సింహికాతనయాయ నమః
రాహవే
సింహవాహాయ
సుధోధరాయ
స్వర్గమార్గస్థాయ
స్విన్నగాత్రాయ
విధుంతుదాయ
స్వర్భానవే
మేర్వప్రదక్షిణగతయే
మేషోచ్చాయ 10
మాషధాన్యప్రీతయే
విష్ణుచక్రక్షతాయ
వక్రాయ
వివిధాగమపారగాయ
పర్వణ్యర్క్కరథస్థాయినే
పురుషాయ
పన్నగాకృతయే
అసురేశాయ
సురగ్రాహిణే
సూర్యచంద్రవిరోధవతే 20
గతిమందాయ
గతయే
మాతామహకారక తాశ్రుతాయ
దయానిధయే
దైత్యపతయే
దక్షాయ
దానవపుంగవాయ
గోమేధికమణి ప్రీతాయ
దుర్గాధిష్టాన దేవతాయ
ధూమ్రాయ 30
ధూమాదిమార్గాఢ్యాయ
శమనాయ
శమీకింకరాయ
గరళాస్యాయ
గతిరుజాయ
గంధర్వాదిపరిష్టుతాయ
మోహినీముఖదివ్యప్తదృష్టయే
మునిమనోహరాయ
జ్వాలాముఖాయ
జగద్వంద్యాయ 40
స్వర్గస్థాయ
సతతోర్ధ్వగాయ
ధూమ్రమాల్యాయ
పైఠినస గోత్రజాయ
అర్థ శరీరాయ
ధూమ్రరథస్థితాయ
ధాత్రే
ఛాయాగ్రహాయ
శనిఫలాయ
నవమే మృత్యుదాయకాయ 50
భుజాదివర్జితాయ
విష్ణుచక్రచ్ఛేదితాయ

లగ్నేనాళవేష్టనకృతే
విభవే
అరాతిఘ్నాయ
ఆశ్లేషానక్షత్రోద్భవాయ
కృతాంతకృతే
సహాస్థితిగ్రహఫలాయ
కరాళాస్యాయ
సితభావవినాశ కృతే 60
ఛాగవాహాయ
ఛిన్నకంఠాయ
శిరోమాత్రావశేషితాయ
తమోగుణాయ
తమాలాభాయ
తరళాస్యాయ
తనుఃప్రభాయ
ఉష్ణాన్నభోజినే
ఉగ్రాభాయ
అష్టమ గ్రహాయ 70
ఉపాంశుగిరే
విద్యుద్వరాయ
విషధరాయ
నీచభాషాయ
నతసురాయ
సురాసంఘార్దనాయ
సూర్యమండలాచ్ఛాదకాయ
సప్తమే కలహప్రదాయ
పాత్రే
పారిజాత ప్రియాయ 80
దళితారయే
దీర్ఘకాయాయ
దీర్ఘజిహ్వాహ్వాతార్కభాసే
దీనబంధుతయాఖ్యాతాయ
చతుర్థేవైరదాయ కాయ
దూర్వాహుతివశీకృతాయ
శూరాయ
షష్ఠే విత్తదాత్రే
దండాకారమణ్డలాయ
ఆదిత్యనైర్భతాస్థానాయ 90
మాషాన్న ప్రీతమానసాయ
దుర్గాసప్తశతపాఠ ప్రియాయ
నవమేపదాత్రే
దుర్గాతిపూజితాయ
అయఃపాత్రస్థిత
స్వర్ణదాన ప్రియకంఠాయ
నీలపట్టార్పణ ప్రీతాయ
నీలాశ్మనిభవిగ్రహాయ
మధుదానప్రీతమనసే
మధుపానలసన్ముఖాయ
దివిస్థితాయ 100
కామరూపిణే
వరదాయ
వాసనప్రియాయ
పూర్వదేవవరాయ
పుణ్యాయ
గ్రహోత్తమాయ
గ్రహపతయే
శుభత్వేతిశుభప్రదాయ 108

ఇతి శ్రీ రాహ్వష్టోత్తర శతనామావళి స్సమాప్తా

# శ్రీ కేత్వష్టోత్తర శతనామావళిః

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం కేతవే నమః
కేతుసమాయ
కాన్తాయ
ముఖహీనాయ
మహాబలాయ
అస్త్యగ్రహాయ
అనల్పఫలాయ
అనుపమాయ
అనుపదాయ
అనుషాయ 10
హ్రీకరాయ
శ్రీకరయ
శ్రీమతే
హ్రాసవృద్ధివివర్జితాయ
కణ్ఠాధశ్శేషాయ
ఈఢ్యాత్మనే
వహ్నితేజసే
వరప్రదాయ
వామనాయ
వారితాశేషవిపజ్జాలాయ 20
విధి ప్రయాయ
వేదస్తుతి ప్రీతమానసే
వేదవేదాంగపారగాయ
త్యక్తాసురస్వభావాయ
రాహోరర్ధాయ
రవిప్రభాయ
ఫణిరూపాయ
ఫాలహీనాయ
ఫేనాభాయ
ఫలమోదవతే 30
చిత్రమాల్యాయ
చిత్రగుణాయ
చిత్రాయ
చిత్రానులేపనాయ
చిత్రాంబరాయే
చిత్రారంధయే
కంఠోపరభుజంగమాయ
శుభ్రగ్రహాయ
గ్రహవరాయ
విషయస్థాయ 40
వనస్థితాయ
అబ్ధారావాహితాయ
అజస్ర ప్రసన్నాయ
అంబుజహస్తవతే
చతుర్భుజహస్తవతే
చతుర్భుజాయ
చలజ్జిహ్వాయ
ఫలహీనాయ
సమాలయాయ
మేర్వప్రదక్షిణకరాయ 50
పింగలాక్షాయ
అమితప్రదాయ
ధ్వజదాన ప్రీతమానసే
ధర్మస్థాయ

ధన్వినాప్రియాయ
గురువారార్చన ప్రీతాయ
గురవే
గిరినాభాయ
కృతినే
గురుతుల్యాయ 60
గళవిషాయ
రాహుతుల్యగతయే
వీరాసనస్థితాయ
వీరాయ
వసుధాయ
వసుమత్ప్రియాయ
గుణినే
విధుగ్రాసకరాయ
మేధకల్పితామోఘశక్తికాయ
సుమమృద్యంగవతే 70
సూర్యమండలాచ్ఛాదకాయ
శుభాయ
తల్పనిలయాయ
ఛాదితార్యమమండలాయ
జ్ఞాతాయ
జ్ఞాత్రే
జ్ఞానగమ్యాయ
దయావతే
జ్ఞానకారకాయ
మోక్షకారకతాఖ్యాతాయ 80
స్థిథభావవర్ధనాయ
సహస్థిత గ్రహఫలాయ
ఛిన్నాయ
ఛాయాగ్రహాయ
శుచయే
ఆదిత్యవాయువ్య భాగస్థాయ
ధ్వజాకారక మండలాయ
సూర్యవైరిణే
సూరివంద్యాయ
గదాపాణయే 90
గదాపహాయ
కుశహోమప్రీతమనసే
కుశరూపాసనప్రియాయ
యజమానప్రియాయ
లాక్షాధూపసంతుష్టమానసాయ
కుళుత్థధాన్యప్రీతాత్మనే
కుటిలాయ
కోటి సూర్యభాయ
పైయూషపాయినే
పూతాత్మనే
పురుషార్థ ప్రదాయ 100
ప్రభవే
జైమినీ గోత్రజాయ
చతుర్భుజాయ
స్వర్ణ బిల్వార్చన ప్రీతాయ
స్వర్ణ ధ్వజరథ స్థితాయ
ధర్మపాలాయ
ధర్మనిత్యా
ధన దారిద్ర్యనాశాయ 108

ఇతి శ్రీ కేత్వష్టోత్తర శతనామావళి స్సమాప్తా

# శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను.

శ్లో॥ నమస్తే స్తు మహామాయే । శ్రీ పీఠే । సురపూజితే ।
శంఖ చక్రగదా హస్తే। మహాలక్ష్మీ నమోస్తుతే।

ఓం ప్రకృత్యై నమః
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచే
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే
ఓం స్వాహాయై నమః
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై 20
అదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
ఓం కమలాయై నమః
కాన్తాయై
కామాక్ష్యై
క్రోధ సమ్భవాయై
అనుగ్రహ ప్రదాయై 30
బుద్ధయే
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోక శోక వినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే 40
పద్మ ప్రియాయై
పద్మ హస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై 50

ఓం పద్మిన్యై నమః
పద్మ గన్ధిన్యై
పుణ్యగన్ధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై
చన్ద్ర వదనాయై
చన్ద్రాయై
చన్ద్ర సహోదర్యై
చతుర్భుజాయై 60
చన్ద్రరూపాయై
ఇన్దిరాయై
ఇన్దు శీతలాయై
ఆహ్లాదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై 70
తుష్టయే
దారిద్ర్య నాశిన్యై
ప్రీతి పుష్కరిణ్యై
శాన్తాయై
శుక్ల మాల్యామ్బరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై
వసున్ధరాయై 80
ఉదారాంగాయై
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధయే
స్త్రైణసౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానన్దాయై
వరలక్ష్మ్యై 90
వసుప్రదాయై
శుభాయై
హిరణ్య ప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళాయై దేవ్యై
విష్ణువక్షస్థలస్థితాయై
విష్ణుపత్న్యై
ప్రసన్నాక్ష్యై
నారాయణ సమాశ్రితాయై 100
దారిద్ర్య ధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మవిష్ణు శివాత్మికాయై
త్రికాలజ్ఞాన సంపన్నాయై
భువనేశ్వర్యై 108

ఇతి శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళి స్సమాప్తా

# శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను.

ఓం దుర్గాయై నమః
శివాయై
మహాలక్ష్మ్యై
మహాగౌర్యై
చండికాయై
సర్వజ్ఞాయై
సర్వలోకేశాయై
సర్వకర్మఫలప్రదాయై
సర్వతీర్థమయాయై
పుణ్యాయై 10
దేవయోనయే
అయోనిజాయై
భూమిజాయై
నిర్గుణాయై
ఆధారశక్త్యై
అనీశ్వర్యై
నిర్గుణాయై
నిరహంకారాయై
సర్వగర్వవిమర్దిన్యై
సర్వలోకప్రియాయై 20
వాణ్యై
సర్వవిద్యాదిదేవతాయై
పార్వత్యై
దేవమాత్రే
వనీశాయై
వింధ్యవాసిన్యై
తేజోవత్యై
ఓం మహామాత్రే నమః
కోటిసూర్యసమప్రభాయై
దేవతాయై 30
వహ్నిరూపాయై
సతేజసే
వర్ణరూపిణ్యై
గుణాశ్రయాయై
గుణమధ్యాయై
గుణత్రయవివర్జితాయై
కర్మజ్ఞానప్రదాయై
కాంతాయై
సర్వసంహారకారిణ్యై
ధర్మజ్ఞానాయై 40
ధర్మనిష్ఠాయై
సర్వకర్మవివర్జితాయై
కామాక్ష్యై
కామసంహంత్ర్యై
కామక్రోధ వివర్జితాయై
శాంకర్యై
శాంభవ్యై
శాంతాయై
చంద్రసూర్యాగ్నిలోచనాయై 50
సుజయాయై
జయాయై
భూమిష్ఠాయై

జాహ్నవ్యై
జనపూజితాయై
ఓం శాస్త్రాయై నమః
శాస్త్రమయాయై
నిత్యాయై
శుభాయై
చంద్రార్థమస్తకాయై
భారత్యై 60
భ్రామర్యై
కల్పాయై
కరాళ్యై
కృష్ణపింగళాయై
బ్రాహ్మై
నారాయణ్యై
రౌద్ర్యై
చంద్రామృతపరిస్రుతాయై
జ్యేష్ఠాయై
ఇందిరాయై 70
మహామాయాయై
జగత్సృష్ట్యధికారిణ్యై
బ్రహ్మాండకోటిసంస్థానాయై
కామిన్యై
కమలాలయాయై
కాత్యాయన్యై
కలాతీతాయై
కాలసంహారకారిణ్యై
యోగనిష్ఠాయై
యోగిగమ్యాయై 80

తపస్విన్యై
ఓం జ్ఞాన రూపాయై నమః
నిరాకారాయై
భక్తాభీష్టఫలప్రదాయై
భూతాత్మికాయై
భూతమాత్రే
భూతేశాయై
భూతధారిణ్యై
స్వధానారీమధ్యగతాయై
షడాధారాధివర్ధిన్యై 90
మోహితాయై
శుభాయై
శుభ్రాయై
సూక్ష్మాయై
మాత్రాయై
నిరాలసాయై
నిమగ్నాయై
నీలసంకాశాయై
నిత్యానందాయై 100
హరాయై
పరాయై
సర్వజ్ఞాన ప్రదాయై
ఆనందాయై
సత్యాయై
దుర్లభరూపిణ్యై
సరస్వత్యై
సర్వగతాయై
సర్వాభీష్టప్రదాయిన్యై 108

ఇతి శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి స్సమాప్తా

# శ్రీ గౌరి అష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను.

ఓం గౌర్యై నమః
గణేశజనన్యై
గుహాంబికాయై
జగన్మాత్రే
గిరితనూభవాయై
వీరభద్రప్రసవే
విశ్వవ్యాపిన్యై
విశ్వరూపిణ్యై
అష్టమూర్త్యాత్మికాయై
అష్టదారిద్ర్యశమన్యై 10
శివాయై
శాంభవ్యై
శాంకర్యై
బాలాయై
భవాన్యై
హైమవత్యై
పార్వత్యై
పాపనాశిన్యై
నారాయణాంశజాయై
నిత్యాయై 20
నిర్మలాయై
అంబికాయై
హిమాద్రిజాయై
వేదాంతలక్షణాయై
కర్మబ్రహ్మమయ్యై
గంగాధరకుటుంబిన్యై
మృడాన్యై
మునిసంసేవ్యాయై
మాలిన్యై
మేనకాత్మజాయై 30
కుమార్యై
కన్యకాయై
దుర్గాయై ఓం సరస్వత్యై నమః
మహాభద్రాయై
మహామాయాయై
వరప్రదాయై
శ్రీప్రథాయై
పద్మనిలయాయై
పద్మాక్ష్యై
పద్మవక్త్రాయై
శివానుజాయై
పుస్తకధృతే 40
జ్ఞానముద్రాయై
రమాయై
పరాయై
కామరూపాయై
మహావిద్యాయై
మహాపాతకనాశిన్యై
మహాశ్రయాయై
మాలిన్యై
మహాభోగాయై
మహాభుజాయై 50
మహాభాగ్యాయై
మహోత్సాహాయై

దివ్యాంగాయై
సురవందితాయై
మహాకాళ్యై
మహాపాశాయై
మహాకారాయై
మహాంకుశాయై
సీతాయై
విమలయై 60
విశ్వాయై
విద్యున్మాలాయై
వైష్ణవ్యై
చంద్రికాయ్యై
చంద్రవదనాయై
చంద్రలేఖ విభూషితాయై
సావిత్ర్యై
సురసాయై
దేవ్యై
దివ్యాలంకార భూషితాయై 70
వాగ్దేవ్యై
వసుధాయై
తీవ్రాయ
మహాభద్రాయై
మహాబలాయై
భోగదాయై
భారత్యై
భామాయై
గోవిందాయై
గోమత్యై 80
శివాయై
జటిలాయై
వింధ్యవాసాయై
వింధ్యాచల విరాజితాయై
చండికాయై
వైష్ణవ్యై
బ్రాహ్మ్యై
బ్రహ్మజ్ఞానైకసాధనాయై
సౌధమిన్యై
సుధామూర్త్యై 90
సుభద్రాయై
సురపూజితాయై
సువాసిన్యై
సునాసాయై
వినిద్రాయై
పద్మలోచనాయై
విద్యారూపాయై
విశాలాక్ష్యై
బ్రహ్మజాయాయై
మహాహలాయై 100
త్రయీమూర్త్యై
త్రికాలజ్ఞాయై
త్రిగుణాయై
శాస్త్రరూపిణ్యై
శుంభాసురప్రమదిన్యై
శుభదాయై
సర్వాత్మికాయై
రక్తబీజనిహంత్ర్యై
చాముండాయై
అంబికాయై
ముణ్డకాయ ప్రహరణాయై
ధూమ్రలోచనమర్దనాయై 108

ఇతి శ్రీ గౌరి అష్టోత్తర శతనామావళి స్సమప్తా

# శ్రీ సరస్వత్యష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను.

ఓం నమస్తే శారదా దేవి జ్ఞానైశ్వర్య ప్రదాయిని।
నిత్యానన్దమయీ వాణీ పాహిమాం భక్తరక్షణి।

ఓం సరస్వత్యై నమః
మహాభద్రాయై
మహామాయాయై
వరప్రదాయై
శ్రీప్రథాయై
పద్మనిలయాయై
పద్మాక్ష్యై
పద్మవక్త్రాయై
శివానుజాయై
పుస్తకధృతే 10
జ్ఞానముద్రాయై
రమాయై
పరాయై
కామరూపాయై
మహావిద్యాయై
మహాపాతకనాశిన్యై
మహాశ్రయాయై
మాలిన్యై
మహాభోగాయై
మహాభుజాయై 20
మహాభాగ్యాయై
మహోత్సాయై
దివ్యాంగాయై
సురవందితాయై
మహాకాళ్యై
మహాపాశాయై
మహాకారాయై
మహాంకుశాయై
సీతాయై
విమలయై 30
విశ్వాయై
విద్యున్మాలాయై
వైష్ణవ్యై
చంద్రికాయ్యై
చంద్రవదనాయై
చంద్రలేఖ విభూషితాయై
సావిత్ర్యై
సురసాయై
దేవ్యై
దివ్యాలంకార భూషితాయై 40
వాగ్దేవ్యై
వసుధాయై
తీవ్రాయ
మహాభద్రాయై
మహాబలాయై
భోగదాయై
భారత్యై
భామాయై
గోవిందాయై
గోమత్యై 50

శివాయై
జటిలాయై
వింధ్యవాసాయై
వింధ్యాచల విరాజితాయై
చండికాయై
వైష్ణవ్యై
బ్రాహ్మ్యై
బ్రహ్మజ్ఞానైకసాధనాయై
సౌదామిన్యై
సుధామూర్త్యై 60
సుభద్రాయై
సురపూజితాయై
సువాసిన్యై
సునాసాయై
వినిద్రాయై
పద్మలోచనాయై
విద్యారూపాయై
విశాలాక్ష్యై
బ్రహ్మజాయాయై
మహాఫలాయై 70
త్రయీమూర్త్యై
త్రికాలజ్ఞాయై
త్రిగుణాయై
శాస్త్రరూపిణ్యై
శుంభాసురప్రమదిన్యై
శుభదాయై
సర్వాత్మికాయై
రక్తబీజనిహంత్ర్యై
చాముండాయై
అంబికాయై 80
ముణ్డకాయ ప్రహరణాయై
ధూమ్రలోచనమర్దనాయై
సర్వదేవస్తుతాయై
సౌమ్యాయై
సురాసురనమస్కృతాయై
కాళరాత్ర్యై
కళాధరాయై
రూపసౌభాగ్యదాయిన్యై
వాగ్దేవ్యై
వరారోహాయై 90
వారాహ్యై
వారిజాసనాయై
చిత్రాంబరాయై
చిత్రగంధాయై
చిత్రమాల్యవిభూషితాయై
కాంతాయై
కామప్రదాయై
వంద్యాయై
విద్యాధరసుపూజితాయై
శ్వేతాసనాయై 100
నీలభుజాయై
చతుర్వర్గఫలప్రదాయై
చతురాననసామ్రాజ్యై
రక్తమధ్యాయై
నిరంజనాయై
హంసాసనాయై
నీలజంఘాయై
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై 108

ఇతి శ్రీ సరస్వత్యష్టోత్తర శతనామావళి స్సమాప్తా

## అథ అంగపూజ

| | | | |
|---|---|---|---|
| ఓం | నిధన పతయే నమః | - | పాదౌ పూజయామి |
| ,, | నిధన పతాంతి కాయనమః | - | జంఘే ,, ,, |
| ,, | ఊర్ధ్వాయ నమః | - | జానునీ ,, ,, |
| ,, | ఊర్ధ్వ లింగాయ నమః | - | ఊరూం ,, ,, |
| ,, | హిరణ్యాయ నమః | - | గుహ్యం ,, ,, |
| ,, | హిరణ్య లింగాయ నమః | - | కటిం ,, ,, |
| ,, | సువర్ణాయ నమః | - | నాభిం ,, ,, |
| ,, | సువర్ణ లింగాయ నమః | - | ఉదరం ,, ,, |
| ,, | దివ్యాయ నమః | - | హృదయం ,, ,, |
| ,, | దివ్య లింగాయ నమః | - | హస్తౌ ,, ,, |
| ,, | భవాయ నమః | - | భుజౌ ,, ,, |
| ,, | భవలింగాయనమః | - | కంఠం ,, ,, |
| ,, | శర్వాయ నమః | - | ముఖే ,, ,, |
| ,, | శర్వ లింగాయ నమః | - | నాసికా ,, ,, |
| ,, | శివాయ నమః | - | నేత్రే ,, ,, |
| ,, | శివ లింగాయ నమః | - | శ్రవణౌ ,, ,, |
| ,, | జ్వాలాయ నమః | - | చుభుకౌ,, ,, |
| ,, | జ్వల లింగాయ నమః | - | లలాటం ,, ,, |
| ,, | ఆత్మాయ నమః | - | మూర్ధ్నే ,, ,, |
| ,, | ఆత్మ లింగాయ నమః | - | శిరః ,, ,, |
| ,, | పరమాయ నమః | - | మౌళిం ,, ,, |
| ,, | పరమలింగాయ నమః | - | సర్వాంగాణి ,, ,, |

బిల్వప్రతాణి పేజి నెం. 219

అష్టోత్తరం పేజి నెం. 288

ధూపం పేజి నెం.9

దీపం పేజి నెం. 9

నైవేద్యం పేజి నెం. 9

తాంబూలం పేజి నెం. 10

దక్షిణాం పేజి నెం. 10

మంగళ హారతి పేజి నెం. 10

## అథ ఉమామహేశ్వర వ్రత కథ

# ప్రథమోఽధ్యాయః

శ్లో॥ నైమిశేకాననే ధీరామునయ శ్శౌనకాదయః॥
ప్రపచ్ఛుస్సూత మార్యేంద్రం సదా పౌరాణి కంపరం॥

పూర్వము నైమిశారణ్యము నందు నివసించు శౌనకాది మహర్షులు సర్వ పురాణవేత్తయైన సూత మహర్షికి నమస్కరించి ఓ మహర్షి సమస్త కోరకలు నెరవేర్చగల ఒక ఉత్తమమైన వ్రతమును తెలుపుమనగా! వారి మాటలు విన్న సూతండు వారికి ఉమా మహేశ్వర వ్రతమును గురించి ఈ విధంగా చెప్పుచున్నాడు.

ఒకనొక సమయమునందు గౌతమ యోగీంద్రుడు సమస్త లోకములను తిరుగుచూ చివరకు మానవ లోకమునకు వచ్చెను. అక్కడ మానవులు అనేక జన్మములు ఎత్తుచూ, వివిధ ఈతి బాధలను అనుభవించుచున్న వారిని చూసి చాలా బాధపడెను. ఈ మానవులకు ఈ దఃఖములను తీర్చుటకై తగిన ఉపాయమును తెలుసుకోవాలని కైలాసమునకు వెళ్ళెను. ఆ కైలాసమునందు సర్వాంగములయందు భస్మమును ధరించి, రుద్రాక్షమాలలంకృతుడై, త్రిశూలమును ధరించి ఉమాదేవితో కూడి కోటి సూర్యకాంతులతో స్ఫటిక మణి వలె విరాజిల్లుతున్న పరమేశ్వరుని చూసి ఋగాది వేద మంత్రములతో స్తుతించెను. భోళా శంకరుడగు పరమేశ్వరుడు గౌతమునితో ఇలా అంటున్నాడు.

ఓ గౌతమా! నీవు ఈ కైలాసమునకు ఎందుకు వచ్చితివి? నీ సందేహం ఏమిటి? ఆ విషయమును వివరించినచో నీ సందేహమును తప్పక తీర్చగలను. అని అనగానే గౌతముడు ఓ సదాశివ! మానవలోకమున ఉన్న మానవులందరూ అనేక కష్టనష్టములు అనుభవించుచూ, దుఃఖంతో మునిగి తేలుచున్నారు. కావున వారి కష్టములు నివారించు సులభమైన ఉపాయమును తెలుపుమని భక్తాభీష్ట వరప్రసాదివైన నిన్ను నేను వేడుకొనుచున్నాను అని తెలిపెను.

ఆ గౌతముని మాటలు మన్నించి పరమేశ్వరుడు ఈ విధంగా పలికెను. లోక కళ్యాణమును కోరే ఓ గౌతమా! నీ పరోపకార బుద్ధి ఎంతో ప్రశంసనీయము. మానవ లోకములోని మనుష్యులను ఉద్ధరించుటకు సులభమైన ఉపాయములను వివరించుచున్నాను. అనేక వ్రతములలో ఉత్తమోత్తమైన ఉమామహేశ్వర వ్రతమను ఒక వ్రతమును తెలుపుచున్నాను. ఈ వ్రతమును నిష్ఠతో, భక్తితో ఆచరించిన వారికి సమస్త కోరికలు నేరవేని అంత్యమందు నా దగ్గరకు రాగలరు అని చెప్పెను.

పరమేశ్వరుని మాటలు విన్న గౌతముడు సంతోషించి ఓ సదాశివా! ఈ వ్రతమును ఏ విధానముగా చేయవలెను? అందులో క్రమము ఎట్టిది? దాని వలన కలుగు ఫలితం ఏమిటి? అని ప్రశ్నించెను.

గౌతముని ప్రశ్నలను విని పరమేశ్వరుడు ఈ విధంగా తెలుపుతున్నాడు. ఓ మహర్షీ ఉమామహేశ్వర వ్రతమును ఆచరించు భక్తుడు భక్తిశ్రద్ధలతో కూడినవాడై వ్రతం చేయు రోజున ప్రథమముగా గురువును, మాహేశ్వరులను, బంధుమిత్రలను ఆహ్వానించి, ఇష్ట లింగ పూజానంతరము గురువు గారి ధూలి పాదోదకంతో గృహమును పవిత్రీకరించి, గురుతీర్థప్రసాదంతో పునీతుడై మాహేశ్వరులు చెప్పిన విధంగా నిష్ఠగా భక్తి శ్రద్ధలతో వ్రతం చెయ్యాలి. నివేదనగా అరటిపండ్లు, ఆవుపాలు, నెయ్యి, చక్కర, గోధుమ పిండి మున్నగు వాటిని ఒక చోట కలిపి నివేదించవలెను. భక్ష్యములను మహానైవేద్యంగా సమర్పించి కర్పూర సహిత తాంబూలమును దక్షిణను సమర్పించవలెను. గురువులకు, మాహేశ్వరులకు సంతృప్తి భోజనముతో పాటు శక్తికొలది సత్కారమును దక్షిణను ఇవ్వవలెను. బందుమిత్రాదులకు భోజనం పెట్టి తాంబూలం ఇవ్వవలెను.

నృత్యగీతాది మంగళ వాయిద్యములతో భక్తిశ్రద్ధలతో ఈ ఉమామహేశ్వర వ్రతం చేయవలెను. ఈ వ్రతం చేసిన వారికి సమస్త కోరికలు నెరవేరును మరియు మోహ శోకములు నశించును. పాపములు పోవును, బంధములు విమోచనమగును విశేషించి ఈ కలియుగమున భూప్రజలకు సులభముగా సమస్త కోరికలు తీరును.

కావున ఓ గౌతమా! లోక కళ్యాణ కారకమైన ఈ వ్రతాన్ని నీకు అనుగ్రహించితిని. దీనిని నీవు అందరికి ప్రచారము చేసి ఫలితం పొందునట్లు చేయముని పరమేశ్వరుడు ఆజ్ఞాపించెను.

ఇతి స్కాంద పురాణే శ్రీ ఉమామహేశ్వర వ్రత కథ
ప్రథమోఽధ్యాయ సమాప్తః

శ్రీ ఉమామహేశ్వర స్వామికీ జై
నమః పార్వతీ పతయే హర హర హర మహాదేవ.
తతః షోడశోపచార పూజాం కరిష్యే॥

# ద్వితీయోఽధ్యాయః

శౌనకాదులు సూతమహర్షిని దర్శించి మహాత్మా ప్రథమోధ్యాయములో ఉమామహేశ్వర వ్రత మాచరించు విధానం తెలిపితిరి. ఇప్పుడు ఆ వ్రతము ఎవరు ఆచరించారు? ఎట్టి ఫలితం పొందారు? అనే విషయములు తెలుసుకోవాలనీ ఆశగా ఉంది. కావున ఆ విషయం తెలుపుమని అడిగిరి. అప్పుడు మహర్షి పూర్వకాలమున మిత్రసేనుడను రాజు గౌతమ మహర్షిని ఈ విధంగానే ప్రశ్నించెను. ఆ గౌతముడు రాజుతో తెలిపిన విషయాన్ని మీకు తెలుపుతున్నాను. శ్రద్ధగా వినండి.

పూర్వము శైవమునియగు దుర్వాసమహర్షి అనేక లోకములు సంచరించుచు వైకుంఠవాసియగు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళెను. విష్ణుమూర్తి దుర్వాస మహర్షిని గాంచి తగిన ఆతిథ్యమివ్వగా దుర్వాసుడు సంతోషించి తనకు సదాశివుని చేత ప్రసాదింపబడిన బిళ్వమాలను విష్ణువునకు కానుకగా ఇచ్చెను. విష్ణుమూర్తి ఆ

బిల్వమాలను తీసుకొని తాను ధరించకుండా తాను ధరించిన సువర్ణ రత్నమాలలో ఈ బిల్వమాల ఎందుకని భావించి ప్రయాణ తొందరలో తన వాహనమైన గరుత్మంతుని కంఠము నందు వేసెను. దుర్వాస మహర్షి ఆ దృశ్యమును చూచిన వెంటనే తీవ్ర కోపంతో ఏమయ్యా! విష్ణుమూర్తి! సమస్త పాప సంహారమైనట్టి పరమేశ్వరునిచే ప్రసాదింపబడిన అతి పవిత్రమైన ఈ బిల్వమాలను నీ యొక్క సమస్త పాపములను నశించాలనే ఉద్దేశ్యంతో నీకు ఇస్తే నీవు నిర్లక్ష్య భావంతో నీ వాహనమైన గరుత్మంతుని కంఠమున వేసితివి. ఇది మిగుల సహింపరాని నేరము. కావున నిన్ను శపించుచున్నాను అని పలికెను.

నీ అహంకారమునకు కారణం సంపదలు ఐశ్వర్యము ఈ సమస్త సంపదలకు కారణము లక్ష్మీదేవి. అందువలన నీ లక్ష్మి పాల సముద్రము నందు పడిపోవు గాక!! నీ వైకుంఠాధికారము నశించుగాక!! నీ వాహనమైన గరుత్మంతుడు ఆకాశంలో ఎగిరిపోవుగాక! నీవు ఏకాకివై తేజోహీనుడవై శక్తిశూన్యుడవై అడవిలో చెట్టు-గుట్టలు తిరుగుదవు గాక! అనేక కష్టములు అనుభవించువు గాక! అని కఠినముగా శపించి దుర్వాస మహర్షి అక్కడి నుండి వెళ్ళిపోయెను.

దుర్వాస మహర్షి శాపం వల్ల విష్ణుమూర్తి భార్యయగు లక్ష్మీదేవి పాల సముద్రలో పడిపోయెను. వైకుంఠాదికారము తొలిగి పోయెను. గరుత్మంతుడు ఎటో ఎగిరి పోయెను. విష్ణుమూర్తి తేజోవిహీనుడై ఘోరమైన అడవిలో ఒంటరిగా తిరుగుచూ, స్వయంకృతాపరాధమునకు చింతించుచూ ఈశ్వర అనుగ్రహమునకు దూరమైన వారు కూడా ఇలాగే అనేక కష్టములు పొందుదురు గదా! అని తనలో తాను మధన పడుచుండగా గౌతమ మహర్షి దర్శనమచ్చి సంకట సమయంలో విష్ణువును ఇలా అడిగెను.

హే విష్ణుమూర్తి! ఈ అడవిలో ఒక్కడివే ఎందులకు తిరుగుతున్నావు. నీ భార్యయగు లక్ష్మీదేవి ఎక్కడ? నీ వాహనమైన గరుత్మంతుడు ఎక్కడ? నీ వైకుంఠాధికారమేమైనది? ఎందులకు ఈ కష్టములు వచ్చినవి అని ఆదర పూర్వకముగా కొన్ని ప్రశ్నలు అడిగెను.

గౌతముడు అడిగిన ప్రశ్నలకు విష్ణుమూర్తి తన కనుల యందు నీళ్ళు నిండగా విషాదముతో చేతులు జోడించుకొని దుర్వాసమహర్షి శాపం వలన లక్ష్మీ పాల సముద్రంలో పడిపోవుట, వైకుంఠాధికారము తొలిగిపోవుట, గరుత్మంతుడు ఆకాశంలోకి ఎటో ఎగిరి పోవుట మున్నగు విషయములను గౌతమ మహర్షికి చెప్పెను. అప్పుడా మహర్షి విష్ణువుతో జరిగిన దానికి విచారింపక శివధ్యానమును చేయమని సమస్త కోరికలు తీర్చగల ఉత్తమమైన శ్రీ ఉమామహేశ్వర వ్రతమును భక్తిశ్రద్ధలచే ఆచరించిన నీవు కోల్పోయిన సమస్త సంపదలు తిరిగి పొందుదువని ఉపదేశించెను. విష్ణుమూర్తి ఆ మునీశ్వరుని మాటలు ఆలకించి భక్తి శ్రద్ధలచే శ్రీ ఉమామహేశ్వర వ్రతమును నిష్ఠగా ఆచరించెను. అందులకు శివుడు ప్రసన్నుడై కోల్పోయిన సంపదలన్నియు తిరిగి విష్ణువునకు అనుగ్రహించెను. ఆ విధంగా పరమేశ్వరుడు విష్ణువునకు లక్ష్మీని, వైకుంఠాధికారమును, గరుత్మంతుని మొదటి వైభవములన్నింటిని అనుగ్రహించి ఆశీర్వదించి ఇకపై శివ తిరస్కార భావమును మనస్సునకు రానీయకుమని హితవు చెప్పి కైలాసమునకు వెళ్ళెను. అప్పటి నుండి విష్ణువు శివున్ని నిష్ఠగా పూజ చేస్తూ, పూజలో శివునకు అలంకరించిన బిల్వమాలను తాను ప్రాసద భావంతో తన మెడలో వేసుకొనెను. (ఇప్పటికి తిరుమలలో శ్రీ వెంకటేశ్వర స్వామికి బిల్వపత్రాలతో పూజించే ఆచారం కలదు.)

ఓ గౌతమా! శ్రీ ఉమామహేశ్వర వ్రతం మిక్కిలి శ్రేష్ఠమైనది. పూర్వం దిక్పాలకులు ఈ వ్రతం ఆచరించి దశదిక్కులకు అధిపతులైన్నారు. స్త్రీలు ఈ వ్రతం చేసిన సౌభాగ్య వంతులు అవుతారు. పురుషులు ఆచరించి తమ కోరికలు నెరవేర్చుకోగలరు. అలాగే కుబేరుడు ఈ వ్రతం ఆచరించి వ్రత మహిమ వల్ల నవ నిధులకు, ధనమునకు అధిపతియై శివభక్తి పరాయణుడై సమస్త సుఖములను అనుభవించెను.

ఇతి స్కాంద పురాణే శ్రీ ఉమామహేశ్వర వ్రత కథ
ద్వితీయోఽధ్యాయ సమాప్తః

శ్రీ ఉమామహేశ్వర స్వామికీ జై
నమః పార్వతీ పతయే హర హర హర మహాదేవ.
తతః షోడశోపచార పూజాం కరిష్యే॥

# తృతీయోఽధ్యాయః

ఉమా మహేశ్వర వ్రత కథలను ఇంకా వినాలనే కోరికతో ఉన్న శౌనకాది మునులను చూసి సూతుండు ఈ విధంగా చెప్పుచున్నాడు.

ఓ మునులారా! పూర్వ కాలంబున మహాతపస్సంపన్నుండును, వేద వేదాంత కోవిదుండును, సదా శివార్చనా పరుండును సదాచార శీలుండును అయిన "మృకండు" అను పేరు గల ఒక మహాముని యుండెను. అతనికి "మరుద్వతి" అని శీలవంతురాలైన భార్య గలదు.

ఆ మృకండు మరుద్వతీ దంపతులకు ఎంతో కాలమునకు గాని సంతానము కలుగలేదు. సంతానము లేని జన్మ వ్యర్థమనీ దలచి, ఈ విషయములో తన భర్త ఎప్పుడు ప్రస్తావించడని భావించి ఆయన ఉపేక్షను సహింపక భర్త దగ్గరకు వెళ్ళి చేతులు జోడించుకొని ఓ మహానుభావా! సంతానము లేని వారికి సద్గతి లేదని పెద్దలు చెప్పుదురు. శాస్త్రీయ వచనము కూడా కలదని తమరికి తెలియనది కాదు. భక్తుల కోరికలు తీర్చగల శంకరుడు దయగలవాడు. అతని గూర్చి తపస్సు చేసినచో మన కోరిక తప్పక తీరుదనుటలో సందేహము లేదు. అని ప్రశ్నించిన భార్యను చూసి మృకండుడు ఇలా అనెను. ఓ కళ్యాణి నీ మాటలు నిజమే! భక్తుల కోరిన కోరికలు తీర్చు శంకరుడు మన కోరిక తీర్చి తప్పక మనకు సంతానమును ఇస్తాడు అని చెప్పి తాను సంతానము కొరకు శివుని గురించి తపస్సు చేయుటకు వెళ్ళెను. కొన్ని రోజులు నీళ్ళు, కొన్ని రోజులు గాలి మాత్రమే తీసుకొనుచు నిష్ఠగా ఘోర తపస్సు చేయుచుండెను. ఆ తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమైన శంకరుడిని చూసి స్తుతించెను.

ఓ శంకరా! నీవు ఆది మధ్యాంత రహితుడవు. భక్తుల దుఃఖములను తీర్చువాడవు. సర్వలోకాలకు అధిపతివి. శరణాగతుడవు అయిన ఓ పరమేశ్వరా! నా కోరకను మన్నించి సంతానమును ప్రసాదించుము అని వేడుకొనెను. ఆ

మాటలు విని శంకరుడు ఓ మునీశ్వరా! నీ కోరిక మన్నించి నీకు ఒక కుమారుడిని ప్రసాదిస్తున్నాను. అతడు వేద వేదాంతుడు అగును. గౌతమ మహర్షితో సమానమైన తపస్సు చేసేవాడగును. కానీ అల్పాయుష్కుడగును. పిదప నా అనుగ్రహంతో దీర్ఘాయుష్మంతు డగుటకు అవకాశము కలదు అని మృకుండు మునికి సంతానము కలుగునట్లు వరమిచ్చి శంకరుడు అదృశ్యమయ్యెను. కొన్ని రోజుల తర్వాత మరుద్వతీ తన భర్తతో సుఖించి, శివుని వరము వలన పదవ నెలలో ఒక కుమారుడిని కనెను. అప్పుడు మృకండుడు చాలా సంతోషించి ఆ శిశు వనకు "మార్కండేయుడని" పేరు పెట్టెను. శివుని వరముచే జన్మించినాడు కావున ఆ బాలునకు శైవదీక్షా సంస్కారము చేయించి తగిన గురువు వద్దకు విద్యాభ్యాసమునకు పంపించెను. తర్వాత సకల విద్యా పారంగతుడగు తమ కుమారుడిని చూసి మరుద్వతీ మృకండులు చాలా సంతోషించారు.

మార్కండేయుడు చిన్నతనం నుండే విద్యా వినయ సంపన్నుడై శివపూజా దురంధరుడై గురువుల పట్ల గురుభక్తితో పెద్దల దగ్గర వినయమును ప్రదర్శించుచు నీతి కోవిదుడై అందరి అభినందనలను పొందుచున్ననూ, అతని అల్పమైన ఆయుష్షును తలుచుకొనుచు కుమారుని ఆయుర్వృద్ధికై మరుద్వతీ మృకండులు శ్రీ ఉమామహేశ్వర వ్రతమును దీక్షగా భక్తి శ్రద్ధలచే చేయుచుండెను. ఈ వ్రత ప్రభావముచే కుమారుడిని పూర్ణాయుష్షునిగా చేయదలచిరి. అలాగే నిరంతరము శివనామ స్మరణముతో కాలము గడుపుచుండిరి.

ఇలా ఉండగా మార్కండేయునకు 16 సంవత్సరములు వచ్చినవి. ఒక రోజు పూజాద్రవ్యముల అగు భస్మ, గంధ, అక్షత, బిల్వపత్ర, పువ్వులను తీసుకొని శివపూజ చేయుటకు శివాలయమునకు వెళ్ళి భక్తి శ్రద్ధలచే శివలింగమును పూజించుచు శివస్తోత్రములను పఠించుచు, శివధ్యానములో ఉన్న సమయంలో యముడు తన వాహనమైన మహిషంపై పాశము గధాదరుండై వచ్చి శివపూజలో ఉన్న శివధ్యానంలో ఉన్న మార్కండేయునితో ఇలా చెప్పుచున్నాడు.

ఓ మునిబాలకా మార్కండేయా! నీ కింక జీవించే అవకాశము లేదు. నీ ఆయుష్షు తీరినది. కావున శివలింగము వదిలి దేవాలయం బయటకు రా! అని

అంటూనే తన కాలపాశమును బాలునిపైకి విసిరెను. అప్పుడు భయంకర ఆకారము గల ఆ యముడిని చూచి మార్కండేయుడు భయము చెంది శివలింగమును గట్టిగా పట్టుకొని ఆర్తితో ఓ దేవదేవా! మృత్యుంజయా! నీ పరమ భక్తుడగు నన్ను రక్షింపుము. నా మొర ఆలకింపుము అని పరి పరి విధముల ప్రార్థించుచుండెను.

ఆ మార్కండేయుని ప్రార్థనను విని పరమేశ్వరుడు ఆ బాలున్ని రక్షింపదలచి ఉగ్రమూర్తియై త్రిశూలమును ధరించి ఆ శివలింగమున నుండే ఉద్భవించి, మరియు కోపంతో ఆ యముడిని త్రిశూలముతో పొడిచెను. అప్పుడా యముడు మిక్కిలి భయం పొంది అంజలిబద్ధుడై భక్తిపూర్వకముగా శివుడిని వేడుకొనెను.

శివుడు శాంతించి యముడితో ఓ యమా! నా భక్తులు నన్ను పూజించు ధ్యానించు సమయంలో నీవు వారి దగ్గరకు రాకు. అని హితవు చెప్పి అక్కడి నుండి వెళ్ళమనెను. తర్వాత మార్కండేయుడిని చూచి ఓ బాలకా! నీకేమి భయము లేదు. నీవు నాకు పరమ భక్తుడవు. మీ తల్లిదండ్రులు నీ ఆయుర్వృద్ధికై శ్రీ ఉమామహేశ్వర వ్రతమును నిష్ఠగా చేసి నా కృపకు పాత్రులైన్నారు. అందువలన నీవు చిరంజీవివైన్నావు. యుగముల పర్యంతము ఈ భూమిపై ఉండి శివయోగిగా ప్రసిద్ధి పొందగలవు అని వరమిచ్చి కైలాసమునకు వెళ్ళెను.

కావున ఆపద సమయంలో అనారోగ్యంతో బాధపడువారు వెంటనే ఈ వ్రతం చేసి మార్కండేయుని వలె పూర్ణాయుష్షును పొంది, సుఖశాంతులతో జీవించిగలరు. అందువలన సురులు, మునులు, మానవులెవరైననూ భక్తి శ్రద్ధలతో ఉమామహేశ్వర వ్రతము ఆచరించి ఆ వ్రతఫలముతో జీవించి ఉన్నాన్నాళ్ళు ఇహ సుఖములు అనుభవించి అంత్యమున శివసాయుజ్యము పొందగలరని శౌనకాదులకు సూతుండు వివరించెను.

ఇతి స్కాంద పురాణే శ్రీ ఉమామహేశ్వర వ్రత కథ
తృతీయోఽధ్యాయ సమాప్తః

శ్రీ ఉమామహేశ్వర స్వామికీ జై
నమః పార్వతీ పతయే హర హర హర మహాదేవ.
తతః షోడశోపచార పూజాం కరిష్యే॥

# చతుర్థోఽధ్యాయః

పూర్వము మగధ దేశమున ధర్మగుప్తుడు అను ఒక వైశ్యుడుండెను. అతనికి ధనధాన్యములు సమృద్ధిగా ఉండెను. అతనికి "సురూప" అను పేరు గల గుణవంతురాలైన భార్య గలదు. ఆ దంపతులకు ఎంతో కాలమైనను సంతానము కలుగకపోవుట చేత చాలా బాధపడుచు తమ జన్మవ్యర్థమైనదిగా తలచుకొనుచుండిరి. కొంతకాలమునకు ఆ వైశ్య దంపతులకు అదృష్టము పండినదియా అన్నట్లు శైవ విద్యా విశారదుడు, బ్రహ్మర్షి అయిన 'దధీచి' అను పేరు గల మహాముని లోకములను తిరుగుచూ ఆ దంపతులకు దర్శనమిచ్చెను. అప్పుడా దంపతులు ఆ మహర్షికి ఆదర పూర్వకమైన ఆతిథ్యమిచ్చి దీన ముఖములో వినయముగా నమస్కరించిరి. ఆ మహాముని వారి విచారమునకు కారణమేమని ప్రశ్నించగా వారు ఓ మహాముని మీ దయ వలన మాకు సంపదలు సమృద్ధిగా ఉన్నవి. కాని సంతానము లేక ఆ బాధ మమ్మల్ని చింతింపచేయు చున్నది. కావున మాకు సంతానము కలుగునట్లు ఏదైనా ఉపాయము చెప్పమని ప్రార్థించిరి. అప్పుడా మహర్షి వారి ప్రార్థనను మన్నించి ఓ వైశ్య దంపతులారా మీరు విచారింపవలదు. మీకు సంతానము కలుగుటకై ఒక వ్రతమును చెప్పుచున్నాను. ఇది శ్రీ ఉమామహేశ్వర వ్రతమను ఒక ఉత్తమమైన వ్రతము. మీరు ఈ వ్రతాన్ని భక్తి శ్రద్ధలచే ఆచరించినచో తప్పక సంతానము కలుగగలదని చెప్పి వ్రత విధానము కూడ చెప్పి ఆ ముని వెళ్ళిపోయెను.

ఆ వైశ్య దంపతులు ముని మాటలు విని మిక్కిలి సంతోషించి శ్రీ ఉమా మహేశ్వర వ్రతమును భక్తిశ్రద్ధలచే ముని చెప్పిన విధంగా ఆచరించి దాని ఫలితముగా దరిద్రుడు నిధిని పొందిన విధముగా వారి చిరకాల కోరిక నెరవేరినట్లు సర్వగుణములు కలవాడయిన పుత్రుడిని పొందిరి. అందువలన సమస్త మానవులు సంతానమునకై ఈ వ్రతమును ఆచరిస్తే తప్పక సంతానము కలుగగలదని సూతుండు శౌనకాదులకు చెప్పెను.

శౌనకాదుల కోరిక మేరకు సూతముని మరియొక కథను చెప్పుచున్నాడు. పూర్వ కాలమున లింగాంగ సంబంధి అగు భద్రుడను పేరు కలిగిన ఒక వ్యాపారస్తుడు ఉండేవాడు. అతడు సదాచార వంతుడై, లింగవ్రత పరాయణుడై, మాహేశ్వరుల వద్ద భక్తి కలిగి నిత్యము జంగమార్చన చేయుచూ ప్రతి సంవత్సరము శ్రీ ఉమామహేశ్వర వ్రతము ఆచరించుచూ సుఖముగా ఉండెను. ప్రతి సంవత్సరము వలే ఆ సంవత్సరము కూడా భక్తి శ్రద్ధలచే వ్రతము చేసి కార్యాంతర నిమగ్నుడై తీర్థప్రసాదమును స్వీకరించుట మరిచిపోయెను. అందువలన అతనికి కడుపులో నొప్పి కలిగి ఆ రాత్రి అంతయూ నిద్రపట్టక ఆయాస పడుచుండెను. కారణము తెలియక బాధపడుతున్న తన భక్తుడైయిన భద్రునకు శంకరుడు కలలో జంగమ రూపమున దర్శనమిచ్చి ఓరే! భద్రా నీవు వ్రతమును భక్తిగా ఆచరించావు. కానీ తీర్థప్రసాదములను ప్రయాణ తొందరలో మరిచిపోయావు. అందువలన నీకు 'ఉదరశూలం'(కడుపులో మంట) వచ్చినది. తిరిగి వ్రతము చేసి భక్తితో తీర్థప్రసాదము గ్రహించినచో నీ కడుపునొప్పి తొలగి సుఖముగా ఉండెదవు అని ఆ జంగమ రుపియైన శివుని మాటలు విని తప్పు తెలుసుకొని పశ్చాత్తాప పడి తిరిగి ఉదయాన్నే మళ్ళీ వ్రతమును చేసి మరిచి పోకుండా తీర్థప్రసాదమును తీసుకొన్న వెంటనే కడుపునొప్పి తగ్గి ఇహమందు సకల సుఖములు పొంది అంత్యమున శివ సాయుజ్యము పొందెను. అందువలన సమస్త మానవులు కూడా వ్రతం అనంతరం తప్పక తీర్థప్రసాదములు తీసుకోవాలనీ గ్రహించగలరు.

ఇతి స్కాంద పురాణే శ్రీ ఉమామహేశ్వర వ్రత కథ

చతుర్థోఽధ్యాయ సమాప్తః

శ్రీ ఉమామహేశ్వర స్వామికీ జై

నమః పార్వతీ పతయే హర హర హర మహాదేవ.

తతః షోడశోపచార పూజాం కరిష్యే॥

# పంచమోఽధ్యాయః

పూర్వము ఒకప్పుడు నైమిశారణ్యము నందు కొంత మంది గొల్లపిల్లలు శ్రీ ఉమామహేశ్వర వ్రతమును ఒక బిల్వచెట్టు క్రింద చేయుటకు సంకల్పించి తాము తెచ్చిన పూజాద్రవ్యములతో తోచిన రీతిగా పూజించి గోధుమ పిండి, శనగలు, అరటిపండ్లు, మొదలగు వాటిని ఒక చోట కలిపి భక్తి పూర్వకముగా నైవేద్యం సమర్పించిరి. ఆ పిమ్మట చేతులు జోడించుకొని సమస్కరించి ఓ దేవా దేవా పరమేశ్వర మాకున్న జ్ఞానముతో నీ వ్రతమును చేసినాము. ఇందులో ఏమైనా దోషములు ఉన్నా క్షమించి మమ్ము చల్లగా కాపాడుమని ప్రార్థించిరి.

అదే సమయంలో అక్కడికి వచ్చిన కర్నాటక రాజు వారి పూజను చూసి సంతోషించెను. కానీ వారు ఇచ్చిన తీర్థ ప్రసాదములను తీసుకొనక గర్వభావముతో సైన్య సహితముగా తన నగరమునకు ప్రయాణం సాగించెను. రాజు నిర్లక్ష్య భావముతో తీర్థప్రసాదములు గ్రహించక పోవుటచే ఈశ్వరునకు కోపం వచ్చినదేమో అన్నట్లు రాజు గారి భార్య పిల్లలు, స్నేహితులు నశించి పోయిరి. రాజ్యము పరహస్తగతమయ్యెను. రాజు గారికి చాలా కష్టములు వచ్చెను. కొంతకాలమునకు అడవిలో ఆ రోజు పూజ చేసిన ఒక గొల్లవాడు రాజుగారికి వచ్చిన ఈ అకస్మాత్తు పరిణామమునకు కారణమేమిటా అని ఆలోచించి బహుశా ఆనాడు రాజు తాము చేసిన వ్రతమును చూసి తీర్థ ప్రసాదములు గ్రహించలేదు. కాబట్టే ఇట్టి కష్టములు కలిగి ఉండునని భావించి రాజుగారిని సమీపించి ఇలా అనెను.

ఓ రాజా! ఆనాడు మేము చేసిన ఉమామహేశ్వర వ్రతమును మీరు దర్శించి సంతోషించారు. కానీ గోల్లవాళ్ళ మనచు చులకన భావంతో మా నుండి తీర్థప్రసాదములు తీసుకోలేదు. కావున మీకు ఇట్టి కష్టములు కలిగి ఉండవచ్చునని నాకు తోచుచున్నది. కావున మీకు పరమేశ్వరునకు క్షమాపణులు చెప్పుకొని ఈ వ్రతమును ఆచరించి భక్తితో తీర్థప్రసాదములు స్వీకరించనచో మీ సంపదలు తిరిగి మీకు లభించగలవు అని ఆ గోపాలుడు చెప్పెను.

రాజు వాడి మాటలు విని నిజమేనని గమనించి భక్తి శ్రద్ధలతో వారిచేతనే శ్రీ ఉమామహేశ్వర వ్రతం చేయించుకొని పరమేశ్వర నా అపరాధమును మన్నించండి. గొల్లలు అనే చిన్న కులం వారు ఇచ్చే ప్రసాదమును తీసుకోలేదు. కావున ఇట్టి నా అహంకారమును తొలగించావు. నీ దృష్టిలో అందరూ సమానులే అన్న విషయమును మరిచాను. నన్ను క్షమించుమని పరిపరి విధముల వేడుకొని మరచి పోకుండా భక్తితో తీర్థప్రసాదమును స్వీకరించి తన తప్పులను మన్నించి తాను కోల్పోయిన పుత్రమిత్ర కళత్రాదులను రాజ్యమును అనుగ్రహించ వలసిందగా ప్రార్థించెను. ఆ ప్రార్థనను మన్నించి ఈశ్వరుడు భార్యాపిల్లలను సంపదలను తిరిగి ఇచ్చెను. రాజు శత్రువులను ఓడించి తిరిగి తన రాజ్యమును స్వాధీన పరచుకొని సుఖముగా ధర్మంగా రాజ్యపాలన కొనసాగించుచుండెను. మరియు ప్రతి నెల నెల ఈ ఉమామహేశ్వర వ్రతము చేయుచు చాలా చాలా కాలము జీవించి అంత్యమున శివసాయుజ్యము పొందెను.

ఈ విధంగా సూతుండు శౌనకాది మునులకు చెప్పి మరల ఓ మునులారా! ఈ వ్రతము చేయడానికి శక్తి లేని వారు ఏవరయినా ఈ వ్రతం చేయచుండగా చూసినను, వ్రత కథలను శ్రద్ధగా విన్ననూ, తీర్థప్రసాదములను తీసుకొన్ననూ వారికి వ్రతం చేసిన ఫలం లభించి ఇహమందు సమస్త సుఖములు పొంది అంత్యమున శివసాయుజ్యము పొందుదురు.

ఇలా 5 అధ్యాయములను విన్న శౌనకాదులు వారునూ వ్రతం చేసి మిక్కిలి ఆనందించి శివసాయుజ్యమును పొందిన్నారు. కావున ఈ వ్రతమునకు వచ్చిన వారందరూ కూడా కష్టసమయంలో మరియు సంవత్సరంలో ఒక రోజైనా వ్రతం చేసి కష్టములు తీర్చుకొని సుఖముగా ఈ జీవితమును గడవపవలసిందిగా చెప్పుతూ ఈ వ్రతమును ముగిస్తున్నాను.

ఇతి స్కాంద పురాణే శ్రీ ఉమామహేశ్వర వ్రత కథ
పంచమోఽ ధ్యాయః సమాప్తః

శ్రీ ఉమామహేశ్వర స్వామికీ జై
నమః పార్వతీ పతయే హర హర హర మహాదేవ.

తతః షోడశోపచార పూజాం కరిష్యే॥

# సత్యనారాయణ వ్రత కథా ప్రారంభః

(ఉమా మహేశ్వర వ్రత విధానం లాగే ఉంటుంది. ఉమా మహేశ్వర స్వామికి బదులు సత్యనారాయణ స్వామి అని చెప్పాలి.

## ప్రథమోఽధ్యాయః

తా॥ పూర్వము శౌనకాది మహామునులు నైమిశారణ్యములో ఉండే వ్యాసశిష్యుడును, పురాణవేత్తయైన సూత పౌరాణికులను ఇలా అడిగిరి.

ఓ సూత పౌరాణికుడా! ఏ వ్రతము లేదా పూజ చేసిన భూలోకమందలి మనుష్యులకు కష్టాలు తొలగి ధనధాన్యములు కలిగి, చివరకు ముక్తిని పొందే ఉపాయము కలదో చెప్పగలరు. అందులకు సూతుండు ఇలా చెప్పెను.

ఓ శౌనకాది మహామునులారా! మీరు వేసిన ప్రశ్న వలెనే నారద మహాముని విష్ణుమూర్తి నడుగగా భగవంతుడగు శ్రీ విష్ణుమూర్తి నారద మహామునికి చెప్పిన దానికి నేను మీకు చెప్పెదను. సావధానంగా వినండి.

ఓ శౌనకాది మహామునులారా! ఒకానొక కాలమందు యోగీశ్వరుడగు నారదమహాముని లోకకళ్యాణము కోరినవాడై సకలలోకాలు తిరుగుచు చివరకు మనుష్యలోకమునకు వచ్చెను. యీ మనుష్యలోకములో మానవులు నానా యోనుల యందు జన్మించుచు నానా పాపములు అనుభవించుచు జన్మాంతర పాపకర్మములచే బాధపడుచుండెడి జనులను చూసి ఇట్టి జనులకు ఏ ఉపాయముచే ఇట్టి దుఃఖములు తిరునని ఆలోచించి, ఆ నారద మహాముని విష్ణులోకమున వెళ్ళి ఆ విష్ణులోకమునందు నిర్మల స్ఫటిక వర్ణము కలిగిన నాలుగు భుజములయందు శంఖ చక్రగదాపద్మమును వనమాలచే అలంకృతుడై ప్రకాశించుచుండెడి శ్రీ మహావిష్ణువును వీక్షించి పరమానందముతో ప్రార్థన చేయుట ఆరంభించెను. నారాయణమూర్తీ! నీవు మనోవాక్కులకు అతీతమైన రూపము గలవాడవు. అపరిమితమైన శక్తి గలవాడవు. మరియు అనంత కళ్యాణగుణములకు ఆధార భూతుడవు. సకల ప్రపంచమునకు అది భూతుడవు. భక్తుల యొక్క దుఃఖమును నశింపచేయువాడవు అని నారద మహాముని చేయుచున్న ప్రార్థనలను శ్రీమన్నారాయణమూర్తి విని నారదమునికి వివరముగా ఇట్లు చెప్పసాగెను.

నాకు చెప్పుము. నేను కూడా ఆ వ్రతము ఆచరించెదను. నాకునూ సంతానము లేదు.

ఈ వ్రతము వలన సంతానము కలుగునని నిశ్చయించుకొని రాజుచే చెప్పబడినఈ వైశ్యుడు వ్యాపారము ముగించి సంతోషముతో ఇంటికి వెళ్ళి భార్యతో ఈ సత్యనారాయణ వ్రతమును చేసిన సంతానకరమని చెప్పి ఎప్పుడు నాకు సంతానము కలుగునో అపుడు ఈ వ్రతము చేయుదునని భార్యయగు లీలావతితో చెప్పెను.

ఒకానొక దినమందు భార్యయగు లీలావతి భర్తతో ఆనందచితుముతో కూడి ఉండగా సత్యనారాయణానుగ్రహము వలన గర్భవతియై పదియవ నెలయందు అడబిడ్డను ప్రసవించెను.

ఆ కన్య దినదినము శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధి పొందెను. పిదప ఆ కన్యకు కళావతి అని నామకరణము చేసెను.

అనంతరము లీలావతి భర్తయగు సాధువును చూసి ఓ స్వామి! పూర్వమందు సంకల్పించుకొనిన వ్రతమును ఎందులకు చేయరు అని అడిగెను.

ఓ ప్రియురాలా! ఈ వ్రతమును మన చిన్నదాని వివాహకాలమందే చేయదునని భార్యను ఊరడించి పట్టణంబునకు వెళ్ళెను. అనంతరము కళావతి యను కన్య తండ్రి యొక్క ఇంటిలో వృద్ధి పొందుచుండగా ఆ కన్యను తండ్రి చూచి పట్నమునందుండు స్నేహితులతో కూడి అలోచించి కన్యా వివాహార్థము బుద్ధిమంతుణ్ణి విచారింపుము అని ఒకానొక దూతను శ్రీఘముగా పంపెను.

ఆ దూత కాంచన నగరమునక వెళ్ళి ఆ పట్టణము నందు ఉండు వైశ్య కుమారుని పిలుచుకొనివచ్చెను. అట్లువచ్చిన సుందరుడుగు బాలున్ని మంచి గుణము కలవాడైన వైశ్య కుమారుని చూచి బంధువులతో కలసి సంతోషముగా ఆ సాధువు ఆ కుమారునికి తన కుమార్తె నిచ్చి యథావిధిగా వివాహము చేయించెను.

ఆ తరువాత ఆనందములో ఆ కన్యయొక్క వివాహ సమయముందు వ్రతమును చేయుట మరచెను. దానిచే నారామణమూర్తి కోపించెను.

ఓ నారద మహాముని! ఇక్కడకు ఏ పని మీద వచ్చినావు ? నీ మనస్సులో ఉన్న అభిప్రాయము చెప్పుము. దానికి నేను జవాబు చెప్పెదను.

ఇలా పలికిన నారాయణమూర్తి యొక్క మాటలకు నారదముని విని ఓ భగవంతుడా! మానవ లోకములో సకల జనులు నానా పాపములు అనుభవించుచు నానా యోనుల యందు సంచరించుచు పాపకర్మములచే బాధపడుచున్నారు. కావున అట్టి బాధలు మానవులకు ఏ ప్రకారము తీరునో అట్టి ఉపాయమును చెప్పుము.

ఇలా నారదుడు ప్రార్థింపగా శ్రీమన్నారాయణమూర్తి ఓ నారద మహామునీంద్రా! లోక కళ్యాణం కోరకు మంచి ప్రశ్న వేసితివి. మానవ లోకములో ఉన్న జనులకు ఏ ఉపాయముచే పాపములు తీరునో అట్టి సులభమైన ఉపాయమును నేను చెప్పెదును వినుము. ఓ మునీంద్రా! మహాపుణ్యాకరమైన మానవ లోకమందు స్వర్గలోకమందు దుర్లభమైనట్టి "సత్యనారాయణ వ్రతమ"ను పేరుగల ఒక వ్రతము కలదు. అ వ్రతమును యథావిధిగా ఆచరించినచో సకల దుఃఖములు తీరి, ఇహలోకమునందు సకల సుఖములు అనుభవించి చివరకు మోక్షమును పొందుదురు.

ఇట్లు నారాయణమూర్తి చెప్పబడిన వాక్యములు నారద మహాముని విని మరల ఇట్లు ప్రశ్నించెను.

ఓ భగవంతుడా! ఇప్పుడు మీచే చెప్పబడిన వ్రతఫలమెట్టిది? దానిని చేయు విధానమెట్టిది? ఈ వ్రతము పూర్వము ఏవరిచే చేయబడినది మరియు ఈ వ్రతము ఏ కాలమందు చేయవలయును? ఈ వివరములు మొత్తము చెప్పుమని ప్రార్థింపగా శ్రీమన్నారాయణమూర్తి ఈ విధముగా చెప్పసాగెను.

ఓ నారదమునీంద్రా ఇప్పుడు నాచే చెప్పబడిన వ్రతము దుఃఖంను తొలగించి, ధనధాన్యవృద్ధి సౌభాగ్య సంతతి సర్వత్ర జయము కలుగజేయును. మరియు ఏదైన ఒక మంచి నెలలో ఒక మంచి రోజు మానవుడు భక్తిశ్రద్ధలు కలవాడై సాయంకాలమున ఈ వ్రతమును ప్రారంభించవలయును. మరియు బ్రాహ్మణులను బంధుజనులను మొదలగువారిని ఆహ్వానించి భక్ష్యంబులు,

అరటిపండ్లు, పాలు, పెరుగు, నెయ్యి, గోధుమ పిండి, చక్కెర కలిపిన నైవేద్యమును భక్తిచే నివేదించి తరువాత బ్రాహ్మణులకు దక్షిణ తాంబూల ఫలములు ఇచ్చి బంధుమిత్రులతో కలసి సత్యనారాయణ వ్రతకథను విని తరువాత బంధుమిత్రులతో కలసి బ్రాహ్మణులకు భోజన, తాంబులాదులను ఇచ్చి, నైవేద్యమును తాను భుజించి సత్యనారాయణ స్వామికి నమస్కారము చేయవలెను.

ఈ విధంగా శ్రీమన్నారాయణమూర్తి నారదమహామునికి చెప్పిన విషయములను శౌనకాది మహామునులకు సూతపౌరాణికుడు జెప్పెను.

ప్రథమాధ్యాయము సమాప్తము

# ద్వితీయోఽధ్యాయః

ఓ ఋషులారా ఈ వ్రతము పూర్వము మొదట ఏవరిచే చేయబడినదో దానిని చెప్పుచున్నాను వినుండి! అందమైన కాశీపట్టణమందు అతి దరిద్రుడగు ఒక బ్రాహ్మణుడు కలడు. అతడు ఆకలి దప్పులచే అలమటిస్తూ రోజు గ్రామమునందు తిరుగుచుండెను.

దుఃఖముతో ఉన్న ఆ బ్రాహ్మణుని చూసి శ్రీమన్నారాయణమూర్తి బ్రాహ్మణుల యందు ప్రేమ, కరుణ కలవాడు కావున వృద్ధ బ్రాహ్మణ రూపమును ధరించి ఆ బ్రాహ్మణునకు ప్రత్యక్షమై ఓ బ్రాహ్మణుడా! అనేక దుఃఖములు కలవాడవై ఎందుకొరకు ఇలా తిరుగుతున్నావో చెప్పుము అని అడిగెను.

ఇలా భగవంతుడు నారాయణమూర్తి యొక్క మాటను విని నేను అతిదరిద్రుడను భిక్షార్థమై ఈ గ్రామమునందు తిరుగుచున్నాను. మీకు ఏదైన ఉపాయము తెలిసిన నా యందు దయచే చెప్పవలెనని బ్రాహ్మణుడు అడిగెను.

ఓ బ్రాహ్మణుడా! నీవు అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పుచున్నాను. సత్యనారాయణుడను పేరు గల విష్ణువు కోరిన కోరికలను ఇచ్చువాడు. కావున మనుష్యులు ఈ వ్రతమును ఆచరించిన దుఃఖములు తొలగును. కావున అట్టి

సత్యనారాయణ వ్రతము నీవు చేయుము అని, ఆ వ్రతము యొక్క ఆచరణ విధానము మొత్తము బ్రాహ్మణునికి వివరించి అనంతరం అదృశ్యమయ్యెను.

తరువాత ఆ బ్రాహ్మణుడు వృద్ధ బ్రాహ్మణ రూపుడగు నారాయణునిచే చెప్పబడిన వ్రతమును అచరించుటకు ఆ రాత్రి నిద్ర కూడా రాక తెల్లవారుజామునే లేచి సత్యనారాయణ వ్రతము చేయటానికి కావలసిన ధనము కొరకు తిరిగెను. వచ్చిన ధనముతో పూజాసామాగ్రిని తీసుకొని బంధుమిత్రులను పిలిచి వ్రతము చేసెను.

అది మొదలు ఆ బ్రాహ్మణుడు ప్రతినెలయందును సత్యనారాయణ వ్రతమును చేసి సర్వపాపములను పోగట్టుకొని మోక్షమును పొందెను.

కావున భూమియందు ఏ మానవుడు ఎప్పుడీ వ్రతమును ఆచరించునో అప్పుడే సర్వదుఃఖములు తొలగును. ఇట్లు నారాయణమూర్తి నారద మహామునికి చెప్పెను. ఓ శౌనకాది మహామునులారా! ఇంకా ఏమి తెలుసుకోవాలను కుంటున్నారో అడుగుము.

ఇట్లు సూతుండు చెప్పిన తరువాత శౌనకాది మహామునులు ఓ సూత పౌరాణికుడా! ఆ బ్రాహ్మణుని వలన ఏవరు వ్రతమును ఆచరించినారో చెప్పుము అని ప్రార్థించెను.

ఓ మహామునులారా! ఈ వ్రతమును ఆ బ్రాహ్మణుడు ప్రతి నెలా బంధు, మిత్రులతో కలసి వ్రతమును చేయుచుండెను.

అలా ఓకసారి ఒక కట్టెలమ్ముమవాడు ఆ బ్రాహ్మణుని ఇంటబయట కట్టెల మోపును దింపి దప్పికతో బ్రాహ్మణుని ఇంటిలోనికి వచ్చి బ్రాహ్మణుని చూచి నమస్కరించి ఓ స్వామి ! మీచే చేయబడు వ్రతమెట్టిది? దీనిని చేసిన ఏమి ఫలము కలుగును. దీనిని సవివరముగా చెప్పుము అని అడిగెను.

కట్టెలను అమ్ముకొనువాడా! ఈ వ్రతము సత్యనారాయణ వ్రతము. ఇది సర్వాభీష్టములు కలుగజేయును. ఈ వ్రతామును ఆచరించుటచే నాకు సమస్తమగు ధనధాన్య సంపత్తు కలిగినదని బ్రాహ్మణుడు చెప్పగా, ఆ బ్రహ్మణుని వలన ఈ

వ్రతమహిమను కట్టెలనమ్మువాడు విని తెలుసుకొని మిక్కిలి సంతోషముతో నీరుత్రాగి ప్రసాదమును స్వీకరించి తన నగరమునకు వెళ్ళి సత్యనారాయణ స్వామిని మనసార ధ్యానించుచు కట్టెల విక్రయముతో ఎంత ధనము వచ్చునో ఆ ధనముచే సత్యనారాయణ వ్రతము చేయుదునని సంకల్పించి కట్టెలను నెత్తిమీద పెట్టకొని పట్టణమునందు ఎక్కడ ధనవంతులుందురో అక్కడికి వెళ్ళి ఆ కట్టెలను విక్రయింపగా చాలా ధనము వచ్చెను.

ఆ ధనముతో అరటిపండ్లు, చక్కెర, నెయ్యి, పాలు, గోధుమపిండి వీటిని తీసుకొని తన ఇంటికి వెళ్ళి బంధుజనులతో కలసి యథావిధిగా వ్రతము ఆచరించెను. ఆ వ్రతమహాత్యముచే ధనము పుత్రులు కలిగి ఇహలోకమందు సుఖము అనుభవంచి చివరకు సత్యలోకమునకు వెళ్ళెను.

ద్వితీయోధ్యాస్సమాప్తః

# తృతీయో౽ధ్యాయః

శౌనకాది మహామునులారా! మరల చెప్పుచున్నానని సూతుడు చెప్పసాగెను. పూర్వము సత్యవాక్కు కలవాడగు ఉల్కాముఖుడను పేరు గల ఒక రాజు కలడు. అతడు ప్రతిదినము దేవాలయమునకు పోవుచూ, బ్రాహ్మణులకు ధనం మిచ్చుచుండెను. కమలముల వంటి ముఖము కలిగిన భార్యతో కూడి నదీతీరమునందు సత్యవ్రతమును ఆచరించుచుండెను.

ఆ వ్రతము ఆచరించు కాలమునందు సాధువగు ఒక వైశ్యుడు వ్యాపార నిమిత్తము విశేష ధనముతో కూడుకొనినవాడై వచ్చి ఆ నదీ తీరమునందు ఓడను నిలిపి రాజు దగ్గరకు వెళ్ళి వినయపూర్వకముగ ఇట్లు ప్రశ్నించెను.

ఓరాజా! నీవు భక్తితో చేయుచున్న వ్రతము ఎట్టిది? దానిని వివరింపుము అని పలికెను.

అందులకు రాజు ఓ సాదువా! నేను సంతానమును కోరినవాడనై అనంత తేజస్సు గల విష్ణుమూర్తి పూజయును, వ్రతమును చేయుచున్నానని పలికిన రాజు మాటలు విన్న సాధువగు వైశ్యుడు ఆసక్తితో ఓ రాజా! ఈ వ్రతము గురించి

కొంతకాలము తరువాత వ్యాపార నిమిత్తము శ్రీఘ్రముగా అల్లునితో కలసి చంద్రకేతు రాజకుమారుని నివాసమగు రత్నసానుపురమునకు వచ్చి సముద్రతీరమునందు అల్లునితో కలసి ఆ సాధువు వ్యాపారము చేయుచుండెను. అట్టి కాలమందు సత్యనారాయణస్వామి సాధువుని చూచి దారుణమగు, కఠినమగు గొప్ప దుఃఖము కలుగునని సాధువగు వైశ్యునికి శాపమిచ్చెను.

తరువాత ఆదే రోజు ఒక దొంగ రాజు యొక్క ధనమును తీసికొని ఎక్కడ వైశ్యులున్నారో అక్కడికి వచ్చి తన వెంటవచ్చు భటులను చూచి భయపడి ఆ వైశ్యులుండు స్థలముందు ధనముంచి ఆ దొంగ కనపడకదాగెను. అటు వెనుక ఎక్కడ వైశ్యుడు ఉండెనో అచ్చటికి భటులు వచ్చి వానిని బంధించి సంతోషంతో రాజు వద్దకు తీసుకొనిపోయి ఓ రాజా! యిద్దరు దొంగలను తీసికొనివచ్చితిమి. వీరిని చూచి ఆజ్ఞ ఇవ్వవలయునని వేడుకొనిరి.

పిదప రాజు ఆజ్ఞ మేరకు ఆ ఇరువురిని గట్టిగా బంధించి అతి భయంకరమగు కారాగృహమందు బంధిచిరి. అటుపిమ్మట చంద్రకేతు మహారాజు ఆ వైశ్యుల ధనము మొత్తము తీసికొనెను.

తరువాత ఆ సత్యనారాయణస్వామి శాపమువలన ఇంటి యందు భార్యయు చాలా దుఃఖితురాలాయెను. మరియు దొంగలచే ఇంటిలో ఉన్న ధనము దోచుకొనబడెను. ఆ వైశ్యుని భార్య మానసికంగా అనేక వ్యాధులతో బాధితురాలు అయ్యెను. అన్నము లేక చింతతో కూడినదై వ్రతి గృహమునకు తిరుగుచుండుటయే గాక కళావతియగు కూతురు కూడా ఆ తీరుననే తిరుగుచుండెను.

అలా ఒకరోజు ఆకలిచే బాధితురాలై తన ఇంటి నుండి బయలుదేరి ఒక స్థలమందు ఒక యువతి సత్యనారాయణ వ్రతమును చేయుచుండగా ఆ వ్రతమును చూచి కథను విని వరములు కోరి ప్రసాదమును స్వీకరించి రాత్రి యింటికి వెళ్ళెను.

ఇంటికి వచ్చిన కళావతిని తల్లి చూచి ప్రేమచే ఓ కూతురా! రాత్రి ఎచ్చట ఉంటివి? అని అడుగగా అమ్మా ఒకానొక బ్రాహ్మణ గృహమందు కోరిన కోరికలు

ఇచ్చు సత్యనారాయణ వ్రతము చేయుచుండగా చూచుచుంటినని పలికెను. ఆ వాక్యమును తల్లియైన లీలావతి విని సంతోషముతో సత్యనారాయణ వ్రతమును చేయటకు బంధుమిత్రములతో కలసి వ్రతము చేసి ఓ స్వామీ! నా భర్త అల్లుడు త్వరగా ఇంటికి రావలయును. నా భర్త యొక్క అపరాధమును, అల్లుని యొక్క అపరాధమును క్షమింపవలయునని స్తోత్రము చేసెను.

శ్రీ సత్యనారాయణమూర్తి ఆ వ్రతముచే సంతోషించి చంద్రకేతు మహారాజునకు కలలో దర్శనమిచ్చి ఓ చంద్రకేతూ! కారాగృహమునందుంచబడిన వైశ్యులను విడుదల చేయుము. వారి ధనము వారికిమ్ము. అటుల ఇవ్వకున్న నీరాజ్యమును ధనమును పుత్రులను నిన్నును నశింపచేయుదునని శ్రీ నారాయణమూర్తి చెప్పి మాయమయ్యెను.

ఉదయమునే రాజు సర్వజనులతో సభా మధ్యమందు కూర్చున్న సమయమునందు తనకు వచ్చిన కలను చెప్పి బంధింపబడిన మహాత్ములగు ఆ వైశ్యపుత్రులను శ్రీఘ్రముగా విడిపింపుడని చెప్పెను.

రాజు వాక్యమును వినిన భటులు మహాపురుషులగు వైశ్యులను విడిపించి విశేష వినయముతో వైశ్యులకు వేయబడిన సంకెళ్ళను వదలించి రాజుఎదుట నిలిపిరి.

రాజును వారిని చూచి శాంతమును వహించి దైవవశము వలన మీకు ఈ దుఃఖము సంభవించినది. ఇప్పుడు మీకేమియు భయములేదని చెప్పి అతిధి సత్కారములు చేసి, వస్త్రాలంకారాములను ఇచ్చి సంతోషింపచేసి వైశ్యుల వద్ద తీసుకున్న ధనమునకు రెట్టింపు ధనమిచ్చి ఓ సాధూ! నీ ఇంటికి వెళ్ళుము అని సెలవిచ్చిన ఆ రాజునకు నమస్కరించి మీ అనుగ్రహము వలన పోయివత్తుమని సెలవు పొందిన వారైరి.

మూడవ అధ్యాయము సమాప్తము

# చతుర్థోఽధ్యాయః

ఇట్లు సాధువగు వైశ్యుడు రాజుయొక్క ఆజ్ఞను పొందినవాడై మార్గమధ్యములో బ్రాహ్మణులకు ధనములు ఇచ్చుచు తన ఇంటికి పోవుచుండెను.

సత్యనారాయణస్వామి సన్న్యాసి వేషధారియై ఓ సాధూ! ఏల చింత చేయుచున్నారు. నీ ఓడ యందు ఏమి ఉన్నదని అడిగెను. అప్పుడు మహాజనులగు వైశ్యులు మదించినవారయి బాగా నవ్వి ఓ తండ్రీ! ఏమి అడుగుచున్నావు. నా యందుండు ధనమును అపహరించుటకే ప్రయత్నించుచుంటివా. అట్టిదేమియును లేదు. మా ఓడ యందు ఆకులు అలములు మొదలయినవి ఉన్నవేగాని మరియొకటి ఏదియును లేదు అని పలుకగా ఆ వాక్యమును వినిన ఆ సన్న్యాసి ఓ సాధూ! నీవు చెప్పిన వాక్యము సత్యము అవుగాక అని పలికి శీఘ్రముగా కొంతదూరము పోయి సముద్రతీరమందు వుండెను.

తరువాత సాధువు నిత్యకృత్యములు తీర్చుకొని లేచి ఓడయందు ఆకులు, అలములు చూచి మూర్ఛిల్లి కొంతసేపటికి తెలివిని పొంది పిమ్మట దుఃఖమును పొందెను.

అప్పుడు అల్లుడు ఓ మామా! ఎందుకు దుఃఖించుట? సన్యాసిచే శాపమివ్వబడినది. ఆ సన్యాసి సమస్తమును చేయు శక్తి గలవాడు. ఆ విషయములో సందేహము లేదు. కావున అతనని శరణు వేడుము అని చెప్పెను.

అల్లుని మాటలు వినిన సాధువు ఆ సన్యాసి దగ్గరకు పోయి ఆ సన్యాసిని చూచి వినయముతో అదరణ పూర్వకముగ నమస్కరించి ఓ స్వామి! మీ సన్నిధి యందు ఏ దుర్మార్గము పలుకబడినదో ఆ అపరాధమును క్షమింపుమా అని మాటిమాటికి నమస్కారములు జేసినవాడయి గొప్ప శోకముచే విలపించుచుండెను.

ఆ వైశ్యుని చూచి దుఃఖింపకుము, నా మాటను వినుము, నా యొక్క పూజ చేయకపోవుట చేత మాటిమాటకి దుఃఖమును కలుగుచున్నదని చెప్పుచున్న భగవంతుని మాటలను విని వైశ్యుడు ఇట్లు స్తోత్రము చేసెను.

ఓ నారాయణమూర్తీ! బ్రహ్మ మొదలైన సమస్త దేవతలు మీ మాయచే వున్నారు. మీ యొక్క గుణములను రూపములను తెలయవు, కావున మూఢుడనగు నేను నీ మాయచే మీ స్వరూపమును ఎటుల తెలిసికొనగలవాడను అగుదును.

కావున ప్రసన్నుడవు కమ్ము. నా శక్తి కొలది నీ పూజ చేయుచున్నాను. కావున పూర్వపు ధనము ఇచ్చి శరణాగతుడనైన నన్ను రక్షింపుము అని ప్రార్థించెను.

ఆ సాధువు యొక్క మాటలను నారాయణమూర్తి విని కోరిన వరమిచ్చి అచ్చటనే మాయమయ్యెను.

తరువాత ధనముచే నిండియున్న ఓడను ఎక్కి సత్యనారాయణుని కరుణచే నా యొక్క కోరిక సఫలమైనది అని చెప్పుచు జనులతో గూడ యథావిధిగా పూజించి సత్యనారాయణస్వామి యొక్క అనుగ్రహము వలన మిక్కిలి సంతోషము కలవాడయి ఓడను కదిలించి తన నగరమునకు ప్రయాణమయి పోవుచుండెను.

అటు వెనుక సాధువు అల్లుని చూచి అల్లుడా మన యొక్క రత్నపురమును చూడుము అని తన ధనరక్షకుడగు భటున్ని పిలిపించెను. ఆ భటుడు పట్టణమునకు పోయి సాధువు యొక్క భార్యను చూచి ఇష్టమగు మాటలను పలికి నమస్కరించి ఇ పట్టణము యొక్క సమీపమందు సాధువు అల్లునితో కూడ వచ్చి బంధువులు, మిత్రులతో కలసియున్నాడని చెప్పెను.

ఆ భటుని మాటలను విని మిక్కిలి సంతోషముగలదై ఆమె సత్యనారాయణ పూజ చేసి ఓ కూతురా! సాధువు యొక్క దర్శనమునకు పోవుదము రమ్మని కుమార్తెను పిలిచెను. ఇట్లు పిలుచుచున్న తల్లి మాటలను విని తానూ సత్యనారాయణ పూజను సమాప్తి చేసి ప్రసాదమును స్వీకరించక తల్లితో కలసి ఆ కళావతియను కన్య భర్తను చూడ వెళ్ళినదాయెను.

అందుచే సత్యనారాయణుండు కోపించినవాడయి ఆమె భర్తను ఓడను ధనముతో కూడ నీటియందు ముంచివెసేను. అటు వెనుక కన్యయగు కళావతి తన భర్త కనిపించకపోవుటచే మిక్కిలి దుఃఖముచే ఏడ్చుచూ చేయుచు భూమిపై పడెను.

అది చూచిన సాధువు భయయుక్తమైన మనసుచే ఇదియేమి ఆశ్చర్యమని విలపించెను. అటువెనుక లీలావతి విశేష దుఃఖముచే విలపించుచున్న భర్తతో ఇట్లు పలికెను.

ఓ స్వామీ! ఇప్పుడు మీ అల్లుడు ఓడతో కూడ కనబడకపోయెను. ఏ దేవుని మాయచే మునిగెనో తెలియదు. సత్యనారాయణుని యొక్క మాయను తెలిసికొన శక్తులెవరు అని విలపించెను.

దానిని చూచి తల్లియగు లీలావతియు బంధుజనులు ఆ కన్యను కౌగలించుకొని విశేషముగ రోదనము చేసినవారైరి. పిదప కళావతి తన పతి నశించుటచే మిగుల దుఃఖము కలదై భర్త యొక్క పాదుకలను గ్రహించి సహగమనము చేయుటకు వెళ్ళెను.

తరువాత సాధువు ఇలా అనెను. మనము సత్యదేవుని పూజను మన యొక్క శక్తికొలది చేయుదమని అందరిని పిలిచి తన కోరిక అందరికి తెలియజేసి సత్యదేవునికి మాటిమాటికి సాష్టాంగ నమస్కారము చేసెను.

ఇట్లు ప్రార్థించుచుండ సత్యదేవుడు వైశ్యుని యొక్క భక్తి విధేయతలను చూచి భక్తులయందు వాత్సల్యము కలవాడై సాధువును గూర్చి యీ మాటలు చెప్పసాగెను. ఓ సాధూ! నీ కన్య నా ప్రసాదమును స్వీకరించకుండా తనభర్తను చూచుటకు వచ్చెను కావున ఆ కాంత యొక్క భర్త కనిపించకపోయెను అని పలికెను.

పిదప ఆ కన్య ఇంటికి వెళ్ళి ప్రసాదమును స్వీకరించి మరల వచ్చి భర్తను చూచెను.కళావతి తన తండ్రిని సమీపించి వెంటనే ఇంటికి పోవుదము ఆలస్యము ఎందుకని చెప్పెను.

ఆ కన్య మాట విని సంతోషముతో సత్యదేవుని యొక్క పూజను యథావిధిగ చేసి బంధువులతో ఇంటికి పోయి జీవితాంతం పూర్ణిమ యందును, సంక్రాంతి యందును సత్యనారాయణ పూజను చేసి ఇహలోకమందు సకల సంపదలు అనుభవించి, చివరకు సత్యపురమునకు వెళ్ళెను.

నాల్గవ అధ్యాయము సమాప్తము

# పంచమోఽధ్యాయః

ప్రజలకు కన్నబిడ్డలవలె పాలించుచున్న తుంగధ్వజుడను రాజు కలడు. అతడు ఒకనొక సమయమందు అడవికి పోయి అనేక విధముల వన్యమృగములను వేటాడి అలసి ఒక చెట్టు క్రింద నిలిచెను. అదే చెట్టు క్రింద గొల్లవారు భక్తియుక్తులై బంధువులతో కూడినవారై సత్యపూజ చేయుచుండగా రాజు వారిని చూచి అక్కడకు వెళ్ళక గర్వముచే నమస్కారమును కూడ చేయలేదు.

తరువాత గొల్లవారు ప్రసాదమును రాజునకు ఇచ్చి, వారు కూడా భుజించిరి. రాజు ప్రసాదమును స్వీకరించక పోవుటచే దుఃఖమును పొందెను. ఇటుల ఆ రాజుయొక్క పుత్రులు, ధనధాన్యము మొదలగునవి అన్నియు నశించెను.

పిదప ఆ రాజు సత్యదేవుని మహత్యముచే నా యొక్క పుత్రపౌత్ర ధనాదులు నశించినవి అని నిశ్చయించి, గొల్లవారి దగ్గరకు వెళ్ళి, గొల్లవారితో కలసి భక్తి శ్రద్ధలు కలవాడై యథావిధిగ సత్యదేవుని పూజించి అతని అనుగ్రహముచే ధనమును పుత్రులను పొంది ఇహలోకమందు సుఖము అనుభవించి అంత్యమందు సత్యపురమునకు వెళ్ళెను.

ఎవరు భక్తితో సత్యపూజ చేయుచున్నారో వారు సత్యదేవుని కృపచే ధనధాన్యాధికమును పొందుదురు. దరిద్రుడీ వ్రతము చేసిన ధనధాన్యపుత్రపౌత్రాది సంపత్తులను పొందును. బంధనము తొలగును. భయము పోయి కోరిన ఫలమును అనుభవించినవాడై అంత్యమందు సత్యపురమునకు వెళ్ళెదరు.

శౌనకాది మహామునులారా! ఏ వ్రతముచే మానవునికి దుఃఖం పోవునో అట్టి సత్యనారాయణ వ్రతమును చెప్పితిని. విశేషముగా కలియుగమందు సత్యపూజ ఫలప్రదముగా ఉండును. కొందరు సత్యదేవుని సత్యేశ్వరుడని, కొందరు సత్యనారాయణుడని, కొందరు సత్యదేవుడని చెప్పుదురు. సత్యదేవుడు నానా రూపములు ధరించి సమస్త జనులకు కోరిన కోరికలనిచ్చువాడై ఉండును. కావున ఓ మునిశ్రేష్ఠులారా! ఈ వ్రతమును నిత్యము ఎవరు పఠింతురో ఎవరు వినుదురో వారి పాపములు సత్యదేవుని కృపచే నశించుచున్నవని సూతుడు శౌనకాది మహామునులకు చెప్పెను.

ఇట్లు శ్రీ స్కాందపురాణమందలి రేవా ఖండమందుండు
సత్యనారాయణ పంచమ వ్రత కథ సమాప్తము.

# అష్టోత్తర శతనామ పూజా

ఓం నారాయణాయ నమః
ఓం నరాయ నమః
ఓం శౌరయే నమః
ఓం చక్రపాణయే నమః
ఓం జనార్దనాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం జగద్యోనయే నమః
ఓం వామనాయ నమః
ఓం జ్ఞానపంజరాయ నమః
ఓం శ్రీవల్లభాయ నమః 10
ఓం జగన్నాథాయ నమః
ఓం చతుర్మూర్తయే నమః
ఓం వ్యోమకేశాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం శంకరాయ నమః
ఓం గరుడధ్వజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం మహాదేవాయ నమః
ఓం స్వయంభువే నమః
ఓం భువనేశ్వరాయ నమః 20
ఓం శ్రీధరాయ నమః
ఓం దేవకీపుత్రాయ నమః
ఓం పార్థసారథయే నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం శంఖపాణయే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం ఆత్మజ్యోతిషే నమః
ఓం అచంచలాయ నమః
ఓం శ్రీవత్సాంకాయ నమః
ఓం అఖిలాధారాయ నమః 30
ఓం సర్వలోకపతిప్రభవే నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం త్రికాలజ్ఞానాయ నమః
ఓం త్రిధామ్నే నమః
ఓం కరుణాకరాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం సర్వగాయ నమః
ఓం సర్వస్మై నమః
ఓం సర్వేశాయ నమః
ఓం సర్వసాక్షికాయ నమః 40
ఓం హరయే నమః
ఓం శార్ఙ్గిణే నమః
ఓం హరయే నమః
ఓం శేషాయ నమః
ఓం హలాయుధాయ నమః
ఓం సహస్రబాహవే నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం అక్షరాయ నమః
ఓం క్షరాయ నమః 50
ఓం గజారిఘ్నాయ నమః
ఓం కేశవాయ నమః
ఓం కేశిమర్దనాయ నమః
ఓం కైటభారయే నమః

ఓం అవిద్యారయే నమః
ఓం కామదాయ నమః
ఓం కమలేక్షణాయ నమః
ఓం హంసశత్రవే నమః
ఓం అధర్మశత్రవే నమః
ఓం కాకుత్స్థాయ నమః 60
ఓం ఖగవాహనాయ నమః
ఓం నీలాంబుదద్యుతయే నమః
ఓం నిత్యాయ నమః
ఓం నిత్యతృప్తాయ నమః
ఓం నిత్యానందదాయ నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం నిర్వికల్పాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం బ్రహ్మణ్యాయ నమః
ఓం పృథివీనాథాయ నమః 70
ఓం పీతవాససే నమః
ఓం గుహాశ్రయాయ నమః
ఓం వేదగర్భాయ నమః
ఓం విభవే నమః
ఓం విష్ణవే నమః
ఓం శ్రీమతే నమః
ఓం త్రైలోక్యభూషణాయ నమః
ఓం యజ్ఞమూర్తయే నమః
ఓం అమేయాత్మనే నమః
ఓం వరదాయ నమః 80
ఓం వాసవానుజాయ నమః
ఓం జితేంద్రియాయ నమః
ఓం జితక్రోధాయ నమః
ఓం సమదృష్టయే నమః
ఓం సనాతనాయ నమః
ఓం భక్తప్రియాయ నమః
ఓం జగత్పూజ్యాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం అసురాంతకాయ నమః
ఓం సర్వలోకానామంతకాయ నమః 90
ఓం అనంతాయ నమః
ఓం అనంతవిక్రమాయ నమః
ఓం మాయాధారాయ నమః
ఓం నిరాధారాయ నమః
ఓం సర్వాధారాయ నమః
ఓం ధరాధరాయ నమః
ఓం నిష్కళంకాయ నమః
ఓం నిరాభాసాయ నమః
ఓం నిష్ప్రపంచాయ నమః
ఓం నిరామయాయ నమః 100
ఓం భక్తవశ్యాయ నమః
ఓం మహోదారాయ నమః
ఓం పుణ్యకీర్తయే నమః
ఓం పురాతనాయ నమః
ఓం త్రికాలజ్ఞాయ నమః
ఓం విష్టరశ్రవసే నమః
ఓం చతుర్భుజాయ నమః

ఓం శ్రీ సత్యనారాయణస్వామినే నమః 108





## మంగళ హారతి

శ్రీ సత్యనారాయణుని సేవకురారమ్మా
మనసారా స్వామిని కొలిచి హారతులీరమ్మా 2
నోచినవారికి నోచినవరము
చూచినవారికి చూచిన ఫలము
స్వామిని పూజించే చేతులే చేతులట
ఆ మూర్తిని దర్శించే కన్నులే కన్నులట
తన కథ వింటే ఎవ్వరికైన జన్మ తరించునట
ఏ వేళయినా ఏ శుభమయినా
కొలిచే దైవం ఈ దైవం ఈ దైవం
అన్నవరంలో వెలసిన దైవం ॥శ్రీసత్య॥

అర్చన చేదామా మనసు
అర్పణ చేదామా
స్వామికి మదిలోనే కోవెల కడదామా
పదికాలాలు పసుపు కుంకుమలు ॥శ్రీసత్య॥
ఇమ్మని కోరేనా

మంగళమనరమ్మా - జయ మంగళమనరమ్మా
కరములు జోడించి శ్రీ చందన మలరించి
మంగళకరమగు ఈ సుందరమూర్తికి ॥శ్రీసత్య॥
వందన మనరమ్మా



# మంగళ హారతులు

## గణపతి హారతి

గజముఖ గణపతి హారతి
నీకు పరిమళ కర్పూర హారతి ॥గజముఖ॥

విద్య ప్రదాతవు సద్గురు నాథవు ॥2॥
బుద్ధిని వసగుము విఘ్నేశ దేవా ॥2॥ ॥గజముఖ॥

పార్వతి పుత్రుడ పరమ పవిత్రుడ ॥2॥
పాశాంకుశ ధర విఘ్నేశ దేవా ॥2॥ ॥గజముఖ॥

శేష విభూషక భూత వినాశక ॥2॥
మూషక వాహన విఘ్నేశ దేవా ॥2॥ గజముఖ॥

## ఇష్టలింగ హారతి

జయశకంర జయశంకర లింగ జయ జయ లింగ జయ జయ
ఇష్టలింగ ఈప్సితార్థ మోక్ష దాయక మహేశ పావనా॥2॥ ॥జయ॥
ప్రాణలింగ పాపభంగ పార్వతీప్రియా పాహిపరశివ ॥2॥ ॥జయ॥
భావలింగ భవవి భంగ భక్తపాలకా భజామి భవహర ॥2॥ ॥జయ॥

## కర్పూరహారతి

కర్పూరగౌరం కరునావతారం । సంసార సారం భుజగేంద్రహారం।
సాదా వసంతం హృదయారవిందే । భావం భవామి సహితం నవామి॥
హస్తే కురంగం గిరమధ్యరంగం । శృంగారి తాంగ గిరిజాను సంగం ।
మూర్ధేందు గంగ మదనాంగభంగం। శ్రీశైల లింగం శిరసా నమామి ॥

# శ్రీ విశ్వారాధ్య మంగళహారతి

శ్రీ విశ్వారాధ్యాయమంగళం । శివ విశ్వైక పాలాయ మంగళం ।
విశ్వేశ జాతాయ విశ్వాది భీజాయ । శ్రీ విశ్వవంద్యాయ మంగళం ।
శివ విశ్వైక పాలాయ మంగళం ॥శ్రీ విశ్వా॥

చరవృంద వంద్యాయ మంగళం । వర చరనీతి భోదాయ మంగళం ।
గురు రూప ధారాయ గురురాజి రాజాయ ॥2॥
పరిపూత దేహాయ మంగళం । శివ విశ్వైక పాణయ మంగళం ॥శ్రీ విశ్వా॥

భవమూల భంగాయ మంగళం । శివ శివ లింగ సంగాయ మంగళం।
భవ మంగలాంగాయ శివ పింగ చూడాయ ॥2॥
కవితుంగ సేవ్యాయ మంగళం । శివ విశ్వైక పాలాయ మంగళం ॥శ్రీవిశ్వా॥

కాశీ పురీశాయ మంగళం । కవి కాశీనాథేయ మంగళం ॥2॥
క్లేశాప హారాయ పశాప్రమోచాయ ॥2॥
శ్రీశాది మాన్యాయ మంగళం । శివ విశ్వైక పాలాయ మంగళం ॥శ్రీవిశ్వా॥

# రేణుక హారతి

శ్రీ గురు రేవణ శ్రీకంఠధారణ శ్రీకాంత కారణ ఓం ఓం ఓం
పాహి పాహి ఫలేక్షణ । దుష్టౌఘ శిక్షణ । శిష్టౌఘ రక్షణ । కష్టౌఘ తక్షణ ఓం ఓం ఓం ॥శ్రీగురు॥

కుంభ సంభవ పూజితా । రంభాపురీస్థిత రంభాది సంస్తుత సాంబాస్య నిర్గత ఓం ఓం ఓం ॥శ్రీ గురు॥

విశ్వ విశ్వ దయాకర । అశ్వత్థ దండదర శాశ్వత శుభకర ఈశ్వర శక్తిద ఓం ఓం ఓం ॥శ్రీగురు॥

వీరగోత్రాధి నాయకా। వర ప్రదాయక గురుత్వ దాయక గురుత్వ కాయక ఓం ఓం ఓం ॥శ్రీ గురు॥

కాశీనాథ కృపాకర । ఆకాశ మార్గశిర లోకేశ శంకర దుష్పాప సంహార ఓం ఓం ఓం ॥శ్రీ గురు॥

# పరమేశ్వరుని హారతి

రారా మంగళమందు కోరా హరా
నాభారంబు నీదే భవానీ వరా॥
కనులారా నిను చూడ మనసున్నది
నా కనులార నిను చూడ మనసున్నది
జీవనమేమో పరికింపక్షణమైనది
కనవేమయా । ఓ కరుణా మయా ॥2॥
నీ కనికరము లేకున్న మనలేమయా ॥రారా॥

ఎడబాసి ఘడియైన విడనాడకూ
నన్నెడబాసి ఘడియైన విడనాడకూ
నీ ఒడిలోన నిడుకొమ్ము పడనీయకు।
తడవెందుకు । కన్నడ సేయకా ॥2॥
నీ యడుగంటి పడియుంటి జడిపించకు ॥రారా॥

పరమాత్మ విశ్వేశ వరదా శివ
హే పరమాత్మ విశ్వేశ వరదా శివ
భాసుర పాండు రంగా క్షమా శేఖరా
పరమేశ్వరా । ఓ గిరిజా ప్రియా॥2॥
శంకర దీన మందార శశిశేఖరా ॥రారా॥

# యజ్ఞహారతి

1. పూజనీయ ప్రభూ హమారే బావు ఉజ్జ్వల్ కీజియు।
   ఛోడ్ దేవ్ ఛల్క పట్‌కో మానసిక్ బల్ దీజియే ॥
2. వేద్‌కీ బోలే రుచాయే సత్యకోదారన్ కరే।
   షర్ష్ మేహో మగ్నసారే శోక్ సాగర్ సేతరే॥
3. అశ్వమేదా దిక్‌రచాయే యజ్ఞపర్ ఉపకార్‌కో।
   ధర్మ మర్యాదా చలాకర్ లాభ్‌దే సంసార్‌కో॥

# మంత్ర పుష్పమ్

యోఽపాం పుష్పం వేద పుష్పవాన్ ప్రజావా''న్ పశుమాన్ భవతి ।
చంద్రమా వా అపాం పుష్పమ్'' । పుష్పవాన్
ప్రజావా''న్ పశుమాన్ భవతి । య ఏవం వేద ।
యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

అగ్నిర్వా అపామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
యో''గ్నేరాయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపోవా
అగ్నేరాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

వాయుర్వా అపామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
యో వాయోరాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।
ఆపో వై వాయోరాయతనమ్ । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ।
యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

అసౌ వై తపన్నపామాయతనమ్ ఆయతనవాన్ భవతి ।
యోఽముష్యతపత ఆయతనం వేద । ఆయతనవాన్
భవతి । ఆపో వా అముష్యతపత ఆయతనమ్ ।ఆయతనవాన్ భవతి ।
య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

చంద్రమా వా అపామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
యః చంద్రమస ఆయతనం వేద । ఆయతనవాన్ భవతి
। ఆపో వై చంద్రమస ఆయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

నక్షత్రాణి వా అపామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
యో నక్షత్రాణామాయతనం వేద । ఆయతనవాన్
భవతి । ఆపో వై నక్షత్రాణామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ।
య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

